సంకలనకర్త పరిచయం



## ఆచార్య కొవ్వలి పద్మనాభ శర్మ

తలిదండ్రులు : శ్రీమతి కొవ్వలి అన్నపూర్ణ,
శ్రీకొవ్వలి వేంకటరాజగోపాలకృష్ణ
గోదావరీతీరంలో జననం. రమ్యగౌతమీ జలాల
సాక్షిగా విద్యాభ్యాసం.

జన్మనిచ్చిన తల్లిరుణమే కాదు. భరతమాత ఋణం కూడా తీర్చుకోవాలనే లక్ష్యంతో భారతీయ వాయుసేనలో సేవ. హైదరాబాదులోని ఉస్మానియా విశ్వవిద్యాలయంలో కమ్యూనికేషన్ మరియు జర్నలిజంలోను, తెలుగులోను ఉన్నత విద్యాభ్యాసం. స్వర్ణపతాక విజేత. ప్రస్తుతం హైదరాబాదు లోని ఒక కార్పొరేటు కంపెనీలో అడ్మినిస్ట్రేషనులో ఉద్యోగం. జన్మపరంపరానుగత సుకృతంతో ప్రాప్తించిన గురువుల సేవనం, వారి ముఖతః అనేక మంచి విషయములను తెలుసుకుని అధ్యయనం, పరిశోధన, రచన, వీరి ప్రవృత్తి. వీరు ప్రత్యక్షంగా సేవచేసుకున్న వారిలో....
గోదావరీ తీరాన ఊనగట్ల గ్రామంలో శ్రీగాయత్రీ పీఠాధిపతులు,
పరమపూజ్య గురుదేవులు శ్రీశ్రీశ్రీ డా. బాదంపూడి వెంకయ్యగారు,
బృందావనమందు శ్రీరాధాఉపాసకులు బ్రహ్మశ్రీ రాళ్లబండి వీరభద్రరావుగారు (నాన్న).
తెనాలి పట్టణమందుండే శ్రీసుబ్రహ్మణ్యస్వామి ఉపాసకులు, మహాతపస్వి
శ్రీశ్రీశ్రీ వెంపటి సత్యనారాయణమూర్తిగారు,
హైదరాబాదు విద్యానగరులోని శ్రీకామేశ్వరీ పీఠాధిపతులు శ్రీశ్రీశ్రీ అయలసోమయాజుల శ్రీరామచంద్రమూర్తిగారు, బోయినపల్లిలోని శ్రీకామేశ్వరసాయి పీఠాధిపతులు బ్రహ్మశ్రీ కొందూరి కామేశ్వరరావుగారు, కుర్తాళ ప్రస్తుత పీఠాధిపతి పరమహంస పరివ్రాజకాచార్య జగద్గురు శ్రీసిద్ధేశ్వరానంద భారతీ స్వామివారు, శృంగేరీ పీఠాధిపతులు జగద్గురు భారతీతీర్థ మహా స్వామివారు, కూకట్‌పల్లి శ్రీదత్తపీఠాధిపతులు భట్లపెనుమర్తి నారాయణమూర్తి గారు, మహాతపస్వి, గురుచరిత్ర వంటి అద్భుతగ్రంథరాజముతో పాటుగా ఎన్నో గ్రంథములను తెలుగువారికి అందించిన మహనీయులు శ్రీమదునూరి రామశర్మగారు, మహామహోపాధ్యాయ దేశికోత్తమ సద్గురు డా. కందుకూరి శివానందమూర్తిగారు ముఖ్యులు.
అయోధ్యారాముడు వచ్చిన వేళ తెలుగువారందరికీ శ్రీమద్వాల్మీకి రామాయణం ఏడు కాండలనూ అందిస్తున్న మహత్కార్యమిది. అనేక స్తోత్రసంకలనములతో పాటుగా, అప్పయ్యదీక్షిత విరచిత శ్రీశివకర్ణామృతము వీరు ప్రచురించారు. ప్రస్తుతము గంగాలహరి (గంగామాత విశేషములు, స్తోత్రములు) శ్రీరాధే!రాధే!, తులసీదాస్ హనుమాన్‌చాలీసా మధురవ్యాఖ్యలు అముద్రితములు.
తెలుగుభాషయన్నా, తెలుగు సంస్కృతియన్నా ఎనలేని మక్కువ గలిగిన
ఆచార్య కొవ్వలి పద్మనాభ శర్మగారు అందిస్తున్న సంపూర్ణ శ్రీమద్వాల్మీకి రామాయణం
ఆస్తికులకు ఆనందదాయిని. శ్రీరామ జయరామ జయజయ రామ !